# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో భాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో భాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ శ్రీ గురు గౌరాంగౌ జయతః

# నామ మహిమ
# నామ రహస్యము

: రచయిత :

**శ్రీల జగదానందపండితులు**

: అనువాదకులు :

నిత్యలీలా ప్రవిష్ట ఓం విష్ణుపాద

**శ్రీశ్రీమద్భక్తివిలాస తీర్థగోస్వామి మహారాజు గారి**

అనుగ్రహముచే

**త్రిదండి శ్రీభక్తి సుధీర దామోదర మహారాజు**

శ్రీ రామానంద గౌడీయ మఠము

కొవ్వూరు.

# మున్నుడి

నామ మహిమ, నామ రహస్యములను ఈరెండు విషయములు "ప్రేమ వివర్త"మనెడి గ్రంథములోని అంశములు. ఈగ్రంథమును శ్రీల జగదానందపండితులు అను మహనీయులు వంగభాషలో రచించియున్నారు. వీరు శ్రీచైతన్య మహాప్రభువు యొక్క పార్షదులు మరియు సమకాలికులు. 'గౌరగణోద్దేశదీపిక, శ్రీచైతన్య చరితామృతము' అను గ్రంథములలో వీరు సత్యభామ అవతారమని వర్ణింపబడియున్నది.

"ప్రేమ వివర్త" మనెడి గ్రంథమునందు గురుతత్త్వము, భగవత్తత్త్వము, జీవతత్త్వము, వర్ణాశ్రమ ధర్మవిశిష్టత, వైష్ణవ మహిమ, వైరాగ్యరహస్యము, సాధనపద్ధతి, ఏకాదశి మాహాత్మ్యము, నవద్వీపములో శ్రీమన్మహాప్రభువు లీలలు, భక్తుల యొక్క లక్షణములు, నామమహిమ, నామరహస్యము మున్నగు అంశములు విపులీకరింపబడినవి.

ఈ గ్రంథమున నామమహిమ, నామరహస్యము అను రెండిటిని గురించి మాత్రము వివరించుట జరిగినది. హరినామ సంకీర్తనమే కలియుగధర్మము. నామమే సాధనము. నామమే సాధ్యము. నామమాహాత్మ్యము గురించి, నామము చేయవలసిన పద్ధతిని గురించియు మనము స్పష్టముగ తెలిసికొనని యెడల నామజపము చక్కగా చేయజాలము. ప్రేమవివర్తమను గ్రంథము చదివినపుడు

అమూల్యమైన ఈరెండు విషయములు ఆంధ్రులకందరకు అందించవలెననెడి సదుద్దేశ్యము కలుగగా ఈచిన్ని పుస్తకమును ముద్రించుట జరిగినది.

శ్రీ జగన్నాథపూరీక్షేత్రములో సముద్రతీరమందు ఒకానొక రోజున శరత్కాల పౌర్ణిమనాడు నామప్రవర్తకుడైన శ్రీమన్మహాప్రభువు హరిదాసు, స్వరూపదామోదర్, రాయరామానందులు మున్నగు భక్తులకు నామరహస్యమును గురించి స్వయముగ చెప్పెను. మరియు ఒకనాడు "గంభీర" అను స్థలములో కృష్ణదాసుడను భక్తుడు నామమాహాత్మ్యమును గూర్చి అడుగగా, "నామమహాత్త్యము వర్ణనాతీతము. అయినను, సమస్తశాస్త్రములలో చెప్పబడినదానిని నీకు వివరింతును" అని చెప్పెను.

నామము నాశ్రయించిన భక్తులు ఈ రెండు విషయములను కూలంకషముగా చదివి ఆప్రకారముగ నామజపమును చేసినచో నామము యొక్క ఫలితమును పొందగలరు . నామ రహస్యమును, మహాత్త్యమును అందఱు శ్రద్ధతో పఠించి ఆచరించి, ఇతరులకు గూడ అందించినచో ఘోరమైన సంసార సముద్రమునుండి ఉత్తీర్ణులై నామప్రభువుయగు శ్రీచైతన్య మహాప్రభుని కృపకు పాత్రులయ్యెదరు గాక.

ఇట్లు

ప్రకాశకులు.

శ్రీ శ్రీ గురు గౌరాంగౌ జయత:

# నామ మహిమ

ఒకానొక రోజున కాశీమిశ్రుని భవనములో వేంచేసి యున్న శ్రీ చైతన్య మహాప్రభువును కృష్ణదాసు అను ఒక భక్తుడు బ్రహ్మాది దేవతలకు గూడ గోచరముకాని కృష్ణనామ మహిమనుగురించి చెప్పవలసినదిగా కోరెను. అపుడు శ్రీమన్మహాప్రభువు ఇట్లు వివరించెను.

ఓకృష్ణదాసా! కృష్ణనామ మహిమ అపారమైనది. ఈనామ ప్రభావమును గూర్చి కృష్ణునికే తెలియదనినను అతిశయోక్తికానేరదు. అయినను నామ మహిమను గురించి అనేక శాస్త్రములలో నేను గ్రహించిన దానిని నీకు చెప్పెదను. దీనిని విశ్వాసముతో శ్రద్ధగా వినుము. ఫలితముగా నీవు ఈ ఘోరసంసార సముద్రమునుండి తరించగలవు.

నిరంతరము హరినామము నుచ్చరించుటవలన సమస్త పాపములు తొలగిపోవును. అన్నిరకముల వ్యాధులు నిర్మూలన మగును. సమస్తదు:ఖములు సమసిపోవును. ఆకలి బాధక్షీణించును. నరకములోనున్నవారుగూడ శీఘ్రముగా తరింతురు. ప్రారబ్ధకర్మము ఖండింపబడును. సమస్త అపరాధములు క్షీణించును.

దాన వ్రత హోమాది సమస్త కర్మలు నామమునే ఆశ్రయించును. వేదములన్నిటియందు సారభూతమై సూర్యుని వలె ప్రకాశించునది నామమే. సమస్త పుణ్యతీర్థముల (ఫలితము) కంటె నామము సర్వోత్కృష్టమని సమస్త శాస్త్రములు ఘోషించుచున్నవి. సమస్త శుభకర్మలు నామముపై ఆధారపడియున్నవి. అయినను వాటి అన్నిటికంటె ఉత్తమ ఫలితమును ఒక్క నామమే ఒసంగును. భగవంతుని సర్వశక్తులు నామము నందిమిడియున్నవి. సమస్త జీవరాసులకు ఆనందము నిచ్చునది భగవన్నామమొక్కటే. శ్రద్ధతో హరినామమును కీర్తించినవారు జగత్తులో పూజనీయులు. దిక్కులేనివారికి నామమే దిక్కు. పతితులనుగూడ పావనులనుగా జేయు సామర్థ్యము నామమునకు గలదు.

కృష్ణనామమును సర్వకాల సర్వావస్థలయందు కీర్తించు వారు ఆనామ సంకీర్తన వలననే ముక్తిని పొందుదురు. మరియు వారికి వైకుంఠధామములో నిరంతరము హరిని కీర్తించుభాగ్యము భగవత్ప్రీతియు కలుగును. స్వయముగ నామమే పురుషార్థముల నిచ్చును. భక్తి అంగములలో నామము ప్రధానమైనదని శ్రుతి, స్మృతి, శాస్త్రములు చెప్పుచున్నవి. దీనికి అసంఖ్యాకములైన ప్రమాణములు గలవు.

## నామము సర్వపాపములను వినాశనము చేయును.

శ్లో॥ అయం హి కృత నిర్వేశో జన్మకోట్యంహసామపి ।
యద్వ్యాజహార వివశో నామ స్వస్త్యయనం హరేః ॥

(భాగవతము 6-2-7)

సమస్త పాపములను నశింపజేయుటయే నామముయొక్క ప్రప్రథమ ధర్మము. దానికి ప్రమాణ మేమనగా - అజామిళుడు అవసానకాలమందు "నారాయణ" శబ్దము ముమ్మారుచ్చరించి కోటి కోటి జన్మలలో చేసిన పాపరాశులనుండి ముక్తిని బొంది భగవత్సాన్నిధ్యము జేరెను.

శ్లో॥ స్తేనః సురాపో మిత్ర ధ్రుగ్ బ్రహ్మహా గురుతల్పగః ।
స్త్రీ రాజ పితృ గో హన్తా యే చ పాతకి నోఽపరే ॥

శ్లో॥ సర్వేషామప్యఘవతా మిదమేవ సునిష్కృతమ్ ।
నామవ్యాహరణం విష్ణోర్యత స్త ద్విషయా మతిః ॥

(భాగవతము 6-2-9,10)

ఇంకను స్త్రీ, రాజు, గోవు, బ్రాహ్మణ, పితృహత్యలు చేసినవారు, మద్యపాన రతుడు, గురుపత్నిగామి, మిత్రద్రోహి, చోరుడు, ఇవియే గాక మిగిలిన పాపములు చేసిన వారుగూడ హరినామ ఉచ్చారణముచే నిష్కృతిని బొందగలరు. ఈ ప్రకారముగ జీవులకందఱకు హరికీర్తనము సద్గతిని ప్రసాదించును.

## సమస్త వ్రతములు నామము కంటె తుచ్ఛములైనవి.

శ్లో॥ న నిష్కృతై రుదితైః బ్రహ్మ వాదిభి
స్తథా విశుధ్యత్యఘవాన్ వ్రతాదిభిః ।
యథా హరేర్నామ పదైరుదాహృతై
స్తదుత్తమః శ్లోక గుణోపలంభకమ్ ॥(భాగవతము 6-2-11)

చాంద్రాయణాది వ్రతములు పాపాత్ములను పాపముల నుండి శాస్త్రములలో చెప్పిన రీతిని తరింపజేయలేవు. ఏలననగా, తాత్కాలిక వ్రతాదులవలన పాపవాసన, పాపబీజము నశింపవు. కాని ఒక్కసారి కృష్ణనామము నుచ్చరించుటవలన పూర్వకృత పాపమేగాక, పాపమునకు మూలకారణమగు అవిద్యగూడ తొలగిపోవును. సమస్త పాపములనుండి రక్షించి ముక్తి నొసంగునది నామమే కావున దీనికి మించిన వ్రతము వేఱొకటి లేదు.

శ్లో॥ సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా ॥
వైకుంఠనామ గ్రహణ మశేషాఘహరం విదుః ॥

(భాగవతము 6-2-14)

ప్రాపంచిక ఫలితముల నాశించిగాని, ఇతరులను హేళన చేయు నుద్దేశ్యముతోగాని, గానము చేయవలెననిగాని, అశ్రద్ధతో గాని వైకుంఠుని నామమును ఎవరు ఆశ్రయించుదురో, వారి అశేష

పాపములు హరింపబడును. ఈ విషయమును శాస్త్రవేత్తలగు భాగవతోత్తములు తెలిసికొని ఉన్నారు.

శ్లో॥ పతిత: స్ఖలితో భగ్న: సందష్టస్తప్త ఆహత: ।
హరిరిత్యవశే నాహ పుమాన్ నార్హతి యాతనా: ॥

(భాగవతము 6-2-15)

పైనుండి క్రిందపడినపుడు గాని, నడచుచు జారినపుడు గాని; శరీరమునకు గాయము తగిలినపుడుగాని, సర్పాది క్రూరజంతువుల వలన హాని కలిగినపుడు గాని, రోగపీడితుడైనపుడు లేదా ఇతరులు శిక్షించినపుడుగాని ఎవరు కృష్ణ, హరి, నారాయణ అనునామములను ఉచ్చరించుదురో వారికి ఎన్నడును నరక బాధ కలుగదు.

శ్లో॥ అజ్ఞానా దథవా జ్ఞానాదుత్తమ: శ్లోకనామ యత్ ।
సంకీర్తితమఘం పుంసో దహేదేధో యథాఽనల: ॥

(భాగవతము 6-2-18)

అగ్ని ఏవిధముగా గడ్డిమేటిని దగ్ధింపజేయునో అట్లే ఎవరు తెలిసిగాని, తెలియకగాని ఉత్తమ: శ్లోకుడగు భగవంతుని నామమును కీర్తించుదురో వారి సమస్త పాపరాశి భస్మీభూతమగును.

శ్లో॥ వర్తమానస్తు యత్ పాపం యద్భూతం యద్భవిష్యతి ।
తత్సర్వం నిర్దహత్యాస్తు గోవింద కీర్తనాఽనల: ॥

(లఘు భాగవతము)

శ్లో॥ నామ్నోఽస్య యావతీ శక్తిః పాప నిర్హరణే హరేః ।
తావత్ కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః ॥

(కూర్మపురాణము)

ఏ పాపియుగూడ చేయలేవంతటి పాపమునుగూడ హరింపజేయ గలశక్తి నామమునకు ఉన్నది. భగవన్నామ మహిమ అంతటిది. అనగా నామము ఎంతటి పాపమునైనను తుడిచి వేయునని అర్థము.

శ్లో॥ తన్నాస్తి కర్మజం లోక వాగ్ జం మానసమేవవా ।
యన్న క్షపయతే పాపం కలౌ గోవింద కీర్తనమ్ ॥

(స్కందపురాణము)

శ్లో॥ అచ్యుతానంత గోవింద నామోచ్చరణ భూషితాః ।
నశ్యన్తి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహం ॥

(బృహద్ నారదీయము)

ఎవరు అచ్యుత, గోవింద, మధుసూదన యని భగవంతుని నామమును ఆర్తితో ఉచ్చరించుదురో వారి సర్వరోగములు (శారీరక, మానసిక) నశింపబడును.ఇది ముమ్మాటికి సత్యము.

శ్లో॥ మహాపాతక యుక్తోఽపి కీర్త యన్నిశం హరిమ్ ।
శుద్ధాంతః కరణో భూత్వా జాయతే పంక్తి పావనః ॥

(బ్రహ్మాండపురాణము)

మహాపాతకు డైనను అహర్నిశము జగదీశ్వరుడగు హరిని కీర్తించినయెడల అంత శుద్ధిగలిగి సజ్జన సాంగత్యమునకు యోగ్యత కలుగును.

శ్లో॥ మహావ్యాధి సమాచ్ఛన్నో రాజవాధోప పీడిత: ।
నారాయణేతి సంకీర్త్య నిరాతంకో భవేన్నర: ॥

(వహ్నిపురాణము)

మహావ్యాధి పీడితుడైనవాడు, రాజదండనము ననుభవించువాడు 'నారాయణ' యని ఆర్తితో నుచ్చరించినచో వారు ఆయాబాధలనుండి తత్ క్షణము విముక్తులగుదురు.

శ్లో॥ సర్వరోగోపశమనం సర్వోపద్రవనాశనం ।
శాంతిదం సర్వారిష్టానాం హరేర్నామానుకీర్తనే ॥

(బృహద్ విష్ణుపురాణము)

నిరంతరము హరినామకీర్తనము చేయువారికి సర్వరోగములు; క్లేశములు, సర్వ ఉపద్రవములు, సర్వ అరిష్టములు తొలగిపోవును.

శ్లో॥ సంకీర్త్యమానో భగవాననంత:
శ్రుతాను భావో వ్యసనం హి పుంసామ్ ।
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం
యథా తమోఽర్కోఽభ్రమివాతి వాత: ॥

(భాగవతము 12-12-48)

సూర్యుడు అంధకారమును, ప్రబలమగు వాయువు మేఘములను దూరీభూతము చేయునట్లు అనంతుడైన భగవంతుని నామమును ఆశ్రయించినవారికి (అనగా శ్రవణ కీర్తనము చేయువారికి) వ్యసనరూప దుఃఖములన్నియు పటాపంచలగును.

శ్లో॥ ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతా
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।
సంకీర్త్య నారాయణ శబ్దమేకం
విముక్త దుఃఖాః సుఖినో భవంతి ॥ (విష్ణుధర్మోత్తరము)

కష్టము వచ్చినపుడు, మనోవ్యాకులత ఏర్పడినపుడు, పతన మొందినపుడు, భయము కలిగినపుడు, ఘోరమైన వ్యాధి పీడితుడై దానికి నివారణోపాయము లేనపుడు "నారాయణ" శబ్దము నొక్కసారి కీర్తించినచో సమస్త దుఃఖములనుండి విముక్తులై సుఖశాంతులను పొందగలరు.

శ్లో॥ కీర్తనాద్దేవ దేవస్య విష్ణో రమిత తేజసః ।
యక్షరాక్షస బేతాళ భూతప్రేత వినాయకాః ॥

శ్లో॥ డాకిన్యో విద్రవన్తిస్మయే తథాఽన్యే చ హింసకా ।
సర్వానర్థహరం తస్యనామ సంకీర్తనం స్మృతమ్ ॥

శ్లో॥ నామ సంకీర్తనం కృత్వా క్షుత్తృట ప్రస్థలితాదిషు ।
వియోగం శీఘ్ర మాప్నోతి సర్వానర్థైర్న సంశయః ॥
(విష్ణుధర్మోత్తరము)

సర్వశక్తి సంపన్నుడును, మహా తేజశ్శాలియు, దేవ దేవుడునగు భగవంతుని నామసంకీర్తనము వలన యక్ష, రాక్షస, బేతాళ, భూత, ప్రేత,డాకిని మొదలగు హింసక వ్యక్తుల యొక్క సర్వానర్థములు హరింపబడుచున్నవి. మరియు ఆకలి, దప్పిక, జారిపడుట మొదలగు దుఃఖములనుండి కూడ అతి శీఘ్రముగ విముక్తులగుదురు. ఇందు సంశయమేమియు లేదు. విశ్వాసముతో నామమును చేయువారు ఫలితమును తప్పక పొందుదురు.

శ్లో॥ కలికాలకుసర్పస్య తీక్ష్ణ దంష్ట్రస్య మా భయమ్ ।
గోవిందనామ దానేవ దగ్ధో యాస్యతి భస్మతామ్ ॥
(స్కాందపురాణము)

కలికాలమనెడి దుష్టసర్పముయొక్క భయంకర కోఱలనుజూసి ఎవరును భయపడ నవసరము లేదు. గోవిందనామ మనెడి దావానలము కలిసర్పమును భస్మీభూతము చేయగలదు.

శ్లో॥ హరినామ పరా యే చ ఘోరే కలియుగే నరాః ।
త ఏవ కృతకృత్యశ్చ న కలి ర్బాధతే హితాన్ ॥

శ్లో॥ హరేకేశవ గోవింద వాసుదేవ జగన్మయ ।
ఇతీరయన్తి యే నిత్యం న హి తాన్ బాధ తే కలిః ॥
(విష్ణు ధర్మోత్తరము)

తా॥ ఘోరమైన ఈ కలియుగములో హరినామము నాశ్రయించిన మానవులు కృతకృత్యులై కలిబాధనుండి విముక్తులగుదురు. అట్టివారు హరి నామమును తప్ప వేఱొక సాధనను స్వీకరింపరు. హరే!కేశవ! గోవింద! మున్నగు నామముల నుచ్చరించుటవలన కలి బాధించదు. ఎవరు విశ్వాసముతో భగవన్నామమును చేయుదురో వారికి హృదయ పవిత్రతగలిగి సుఖశాంతులు వృద్ధియగును. మరియు వారు ఆ నామమందే రమింతురు.

శ్లో॥ యథాయథా హరేర్నామ కీర్తయన్తిస్మ నారకాః ।
తథాతథా హరౌ భక్తిముద్వహన్తో దివం యయుః ॥

నరకములోనున్న వారైనను ఏవిధముగనైనను నామమును ఎవరు ఆర్తితో కీర్తింతురో వారు ఆయావిధముగ భక్తిని పొంది దివ్యమైన భగవత్సాన్నిధ్యము జేరగలరు.

శ్లో॥ నాతః పరం కర్మనిబంధ కృంతనం
ముముక్షతాం తీర్థ పదానుకీర్తనాత్ ।
నయత్ పునః కర్మసు సజ్జతే మనో
రజస్తమోభ్యాం కలిలం తతోఽన్యథా ॥ (భాగవతము 6-2-46)

తా॥ ముక్తిని బొందవలెననెడి కోరిక గలవారలకు తీర్థ పద స్వరూపుడైన భగవంతుని నామమును కీర్తించుటకంటె కర్మ

బంధముల తొలగించు వేఱొక మార్గము లేదు. కారణమేమనగా నామసంకీర్తన వలన చిత్తము కర్మయందు లిప్తము కాదు. ప్రాయశ్చిత్తాదుల వలన (తాత్కాలికముక్తి లభించినను) మరల రజస్తమోగుణములవలన మనసు కలుషితమగును.

శ్లో॥ యన్నామధేయం మ్రియమాణ ఆతురః
పతన్ స్ఖలన్ వా వివశో గృణన్ పుమాన్ ।
విముక్త కర్మార్గల ఉత్తమాం గతిం
ప్రాప్నోతి యక్ష్యన్తి న తం కలౌ జనాః ॥

(భాగవతము 12.3.44)

తా॥ ఎవని నామధేయమును మరణశయ్యపై యుండిగాని ఇంద్రియములు పటుత్వము తగ్గినపుడు గాని ఆతురతతో నున్నపుడు గాని గద్గదస్వరముతో ఉచ్చరించిన సమస్త కర్మలనుండి విముక్తులై ఉత్తమ గతిని బొందగలరో అట్టి భగవానుని నామమును ఈకలియుగ జీవులు సేవించలేరు కదా!

శ్లో॥ మమ నామాని లోకేఽస్మిన్ శ్రద్ధయా యస్తు కీర్తయేత్ ।
తస్యాపరాధకోటిస్తు క్షమామ్యేవ న సంశయః ॥

(విష్ణుయామలము)

తా॥ ఎవరు కుటిలత్వము లేక శ్రద్ధతో నాయొక్క నామమును చేయుదురో అట్టివారి కోటి అపరాధములనైనను నేను క్షమించుదును, ఇందు సంశయము లేదు. ఈవిషయమందు ఎవరికి విశ్వాసములేదో వారు నిజముగ మందభాగ్యులు. అట్టివారి తరణమునకు మార్గము లేదు అని మహావిష్ణువు చెప్పెను.

శ్లో॥ మన్త్ర తన్త్రన్తతశ్ఛిద్రం దేశ కాలార్హ వస్తుత: ।
సర్వంకరోతి నిశ్ఛిద్రమను సంకీర్తనం తవ ॥ (భాగవతము 8.23.16)

తా॥ మంత్ర, తంత్రముల వలనను ఆయా దేశకాలములలోని వస్తువుల వలనను ఏర్పడిన దోషములనునీనామసంకీర్తన మాత్రము పోగొట్టుచున్నది. సమస్త సత్కర్మలకంటెను నామము శ్రేష్ఠమైనది. దానిని ఆశ్రయించినవారికి ఇతర శుభకర్మలను చేసిన సిద్ధిగూడ లభించును.

శ్లో॥ ఋగ్వేదో హి యజుర్వేద: సామవేదోప్య థర్వణ: ।
అధీతాస్తేన యేనోక్తం హరి రిత్యక్షర ద్వయమ్ ॥

(విష్ణుధర్మోత్తరపురాణము)

తా॥ "హరి" యను రెండక్షరములను ఉచ్చరించువారు ఋక్, యజు స్సామ అథర్వణ వేదములను అధ్యయనము చేసినట్టి వారలగుదురు. నామము సర్వవేదములకంటె అధికతరము. ఈవిషయమున సంశయము ఉన్నవారికి ఎన్నడును శ్రేయస్సు

గలుగదు. చతుర్ముఖ బ్రహ్మనుండి వెలువడిన వేదములయొక్క సారము ప్రణవము. ఆ ప్రణవము కృష్ణునియొక్క నామము.

శ్లో॥ మా ఋచో మా యజుస్తాత మా సామ పఠ కించన ।
గోవిందేతి హరేర్నామ గేయం గాయస్వ నిత్యశః ॥
(స్కాందపురాణము)

తా॥ చతుర్వేదములను ఏలపఠించుదువు? గోవిందా గోవిందా అని నిత్యము గానము చేయుము.

శ్లో॥ విష్ణోరేకైక నామాపి సర్వవేదాధికం మతమ్ ।
తా దృక్ నామసహస్రేణ "రామ" నామసమంస్మృతమ్ ॥
(పద్మపురాణము)

తా॥ విష్ణునామము ఒక్కొక్కటి సర్వవేదములకంటె అధికమైనది. అట్టి సహస్రనామములు ఒక్క "రామ" నామమునకు సమానము.

శ్లో॥ సహస్రనామ్నాం పుణ్యానాంత్రిరావృత్త్యాతు యత్ ఫలమ్ ।
ఏకావృత్త్యా తు కృష్ణస్య నామైకం తత్ ప్రయచ్ఛతి ॥
(బ్రహ్మాండపురాణము)

తా॥ సహస్రనామములను ముమ్మారు (లేక మూడుసార్లు రామనామము) పఠించినచో ఏ ఫలితము పొందుదుమో ఆ

ఫలితమును ఒక్కసారి కృష్ణనామము ఉచ్చరించినంతనే లభ్యమగును. కావున భక్తులారా! కృష్ణనామమును నిరంతరము కీర్తించుడు.

శ్లో॥ హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ।
హరేరామ హరేరామ రామరామ హరేహరే ॥

పదహారు నామములతో కూడిన ఈ మహామంత్రము సర్వోత్కృష్టమైనది. ఈనామ జపమువలన సర్వసిద్ధులు లభించును.

శ్లో॥ కురుక్షేత్రేణ కిం తస్య కిం కాశ్యా పుష్కరేణ వా ।
జిహ్వాగ్రే వసతే యస్య హరి రిత్యక్షర ద్వయమ్ ॥

(స్కాందపురాణము)

తా॥ ఎవని నాలుకపై అహర్నిశము హరినామము తాండవము చేయునో వానికి కురుక్షేత్రము, కాశి, పుష్కర క్షేత్రము మొదలగు తీర్ధ పర్యటనల వలన ఫలమేమి?

శ్లో॥ తీర్థకోటి సహస్రాణి తీర్థకోటి శతాని చ ।
తాని సర్వాణ్య వాప్నోతి విష్ణోర్నామాను కీర్తనాత్ ॥

(వామనపురాణము)

తా॥ సహస్రకోటి తీర్థయాత్రలు చేసినంతటి ఫలితమును అతి శీఘ్రముగ నిరంతర నామసంకీర్తనవలన పొందగలము.

శ్లో॥ విశ్రుతాని బహున్యేవ తీర్థాని బహుధాని చ ।
కోట్యం శేనాపి తుల్యాని నామకీర్తనతో హరేః ॥

(విశ్వామిత్రసంహిత)

తా॥ ఒకానొకప్పుడు కురుక్షేత్రములో విశ్వామిత్రుడు తన భక్త సమూహమునకు ఇట్లు చెప్పెను,

"ఈ భూమండలమునందుగల అనేక తీర్థములనుగురించి వింటిని. కాని హరినామము యొక్క కోటి అంశముతోనైనను అవి ఏవియు సమము కానేరవు. నామము అంతటి విలువైనది".

శ్లో॥ కిం తాత వేదాగమ శాస్త్రవిస్తరైః
తీర్థరనేకైరపి కిం ప్రయోజనమ్ ।
యద్యాత్మనో వాంఛసి ముక్తి కారణం
గోవింద గోవింద ఇతి స్ఫుటం రట ॥ (లఘు భాగవతము)

తా॥ "నాయనా! వేద, ఆగమ, శాస్త్రాదుల పఠనము వలనను, అనేక తీర్థపర్యటనలవలనను ఏమి ప్రయోజనము? ఒకవేళ నీకు ముక్తి కావలయునన్నచో గోవిందా! యని అనుక్షణము స్పష్టముగా కీర్తించుము".

శ్లో॥ గోకోటిదానం గ్రహణే ఖగస్య ప్రయాగ గంగోదకే ।
యజ్ఞాయుతం మేరు సువర్ణదానం గోవిందకీ ర్తేర్నసమం
శతాంశైః ॥ (లఘు భాగవతము)

తా॥ సూర్యగ్రహణకాలమందు కోటి గోవులను దానము చేసినను, మాఘమాసవ్రత నియమానుసారము ప్రయాగలో గంగానదీ తీరమందు కల్పమువరకు నివాసముచేసినను, అసంఖ్యాకములైన యజ్ఞములు చేసినను, మేరుపర్వత సమానమగు సువర్ణ దానము చేసినను, గోవింద కీర్తనములో నూరవ అంశమునకు అవన్నియును సమము కానేరవు.

శ్లో॥ ఐష్టాపూర్తాని కర్మాణి సుబహూని కృతాన్యపి ।
భవహేతుర్భి తాన్యేవ హరేర్నామ తు ముక్తిదమ్ ॥

(బోధాయన సంహిత)

తా॥ చెఱువులు, నూతులు, తోటలు నిర్మించుట, మొదలగునవి పుణ్యకర్మలైనను బంధనహేతువులే అగుచున్నవి. శ్రీహరి నామ సంకీర్తనమొక్కటే శ్రీహరి పాదారవిందముల యొద్దకు (ముక్తికి) మనలను చేర్పగలదు.

శ్లో॥ కిం కరిష్యతి సాంఖ్యేన కిం యోగై ర్నరనాయక ।
ముక్తిమిచ్ఛసి రాజేంద్ర కురు గోవిందకీర్తనమ్॥

(గరుడపురాణము)

తా॥ "రాజేంద్రా! సాంఖ్య, యోగశాస్త్రములతో నీకు పని యేమున్నది? నీకు ముక్తి కావలయునేని గోవిందనామ కీర్తనము చేయుము''.

శ్లో॥ అహో బత శ్వపచోఽతో గరీయాన్
యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్ ।
తేపుస్తపస్తే జుహువుః సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణన్తి యేతే ॥(భాగవతము 3.33.7)

తా॥ స్వపచుడైనను నీ (భగవానుని) నామమును నాలుక యందుంచు కొనుటచే సర్వోత్కృష్టుడగును. నామము నుచ్చరించు వారు తపస్సులు చేసినట్టివారు, హోమము చేసిన వారు, సర్వతీర్థముల స్నానమొనర్చినవారు, వేదము నధ్యయన మొనర్చినవారే యగుదురు.

శ్లో॥ ఏతత్ షడ్వర్గహరణం రిపునిగ్రహణం పరమ్ ।
ఆధ్యాత్మమూలమేతద్ధి విష్ణోర్నామానుకీర్తనమ్ ॥
(స్కాందపురాణము)

తా॥ నిరంతర కృష్ణనామ సంకీర్తనముచే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు నశించుచున్నవి. సర్వబాహ్యశత్రు వినాశమును కలుగుచున్నది. ఆధ్యాత్మిక వైభవ సిద్ధికి నామకీర్తనమే మూలకారణమగుచున్నది.

శ్లో॥ కలిం సభాజయన్త్యార్యా గుణజ్ఞాః సారభాగినః ।
యత్ర సంకీర్తనేనైవ సర్వం స్వార్థోఽభిలభ్యతే ॥
(భాగవతము 1-5-36)

తా॥ "నానామమును నిరంతర ముచ్చరించువారు కృతార్థులును, ధన్యజీవులును అగుచున్నారు. వారు సార్థక జన్మలగుచు సర్వార్థసిద్ధి నొందినవారగుచున్నారు''.

"కలియుగమందలి పాపజన్మలలో మిక్కిలి దుర్లభమైన హరి నామము నొక్కసారియైన నుచ్చరించువాడు ధన్యతము డగుచున్నాడు, ఇందు సంశయమేమియులేదు. గుణజ్ఞులు, సారజ్ఞులునగు మహాత్ములు ఈ కలియుగమును పొగడుచున్నారు. ఏమన, ఈ కలియుగమందు కృష్ణనామోచ్చారణముచే మానవ కోటికి సర్వార్థసిద్ధి కలుగుచున్నది. శ్రీహరినామ సంకీర్తనమే ఈ కలియుగమునకు సర్వోత్తమరూప తపస్సగుచున్నది. కనుక శ్రీకృష్ణ ప్రీతికై అతని నామమును కీర్తించుటయే అవశ్య కర్తవ్యమగుచున్నది''.

శ్లో॥ దానవ్రత తపస్తీర్థక్షేత్రాదీనాంచ యాః స్థితాః ।
శక్త యోదేవ మహతాం సర్వపాప హరాః శుభాః ॥

శ్లో॥ రాజసూయాశ్వ మేధానాం జ్ఞాన మధ్యాత్మ వస్తునః।
ఆకృష్య హరిణా సర్వాః స్థాపితాః స్వేషు నామసు ॥
(స్కాందపురాణము)

తా॥ దానములు, వ్రతములు, తపస్సులు, తీర్థయాత్రలు, దేవతాపూజనము, సాధుపూజనము,అశ్వమేధము, రాజసూయము

మొదలైనవి చేయుటచేతను, ఆత్మజ్ఞానము కలుగుటచేతను సమస్తపాపములు నశించుచున్నవి. వానియందలి శక్తులన్నియు శ్రీహరిచేత ఆయాకర్మలనుండి ఆకర్షింపబడి తన నామముల యందర్పింపబడినవి.

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ ప్రహృష్య త్యనురజ్య తే చ ।
రక్షాంపి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధ సంఘాః ॥ (గీత. 11.36)

తా॥ "హృషీకేశా! నీనామ మహిమను కీర్తించుచు జగత్తంతయు ఆనందము నొందుచున్నది. నీకీర్తనమందనురాగము కలిగిన దగుచున్నది. నిన్ను చూచి రాక్షసులందఱును నలుదిక్కులకు పాఱిపోవుచున్నారు. సిద్ధులందఱు నీకు నమస్కరించుచున్నారు".

శ్లో॥ నారాయణ జగన్నాథ వాసుదేవ జనార్దన ।
ఇతీరయన్తి యే నిత్యం తే వై సర్వత్ర వందితాః ॥

శ్లో॥ స్వపన్ భుంజన్ వ్రజం స్తిష్ఠన్ను త్తిష్ఠంశ్చవదం స్తథా ।
యే వదన్తి హరేర్నామ తేభ్యో నిత్యం నమోనమః ॥

(బృహన్నారదీయము)

తా॥ "ఓనారాయణా! ఓజగన్నాథా! ఓవాసుదేవా ! ఓజనార్దనా!" అనుచు నిత్యము భగవన్నామోచ్చారణము చేయువారు ప్రపంచమున కంతటికి వందనీయులగుచున్నారు.

నిద్రించుచుగాని, భుజించుచుగాని, నడచుచుగాని, కూర్చుండి గాని, లేచుచుగాని, సంభాషించుచుగాని, నిత్యము హరి నామోచ్చారణము చేయువానికి నేను దండవత్ప్రణామము చేయుచున్నాను. కావున దీనివలన దీక్షాప్రాయశ్చిత్తముల ఆవశ్యకత లేదనియు, నామోచ్చారణమునకు కాలనియమము లేదనియు సూచింపబడినది.

శ్లో॥ స్త్రీశూద్రః పుక్కసో వాపి యే చాన్యే పాపయోనయః ।
కీర్తయంతి హరిం భక్త్యా తేభ్యోఽపీహ నమోనమః ॥

(నారాయణవ్యూహస్తవము)

తా॥ నిశ్చలభక్తితో సదా హరినామ సంకీర్తనము చేయునట్టి స్త్రీలకు, శూద్రులకు, చండాలురకు, పాపయోనులగు నితరులకు నేను మాటి మాటికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ అనన్యగతయో మర్త్యా భోగి నోఽపి పరన్తపః ।
జ్ఞానవైరాగ్యరహితా బ్రహ్మచర్యాది వర్జితాః ॥

శ్లో॥ సర్వధర్మోజ్ఝితా విష్ణోర్నామమంత్రైక జల్పకాః ।
సుఖేన యాం గతిం యాన్తి న తాం సర్వేఽపి ధార్మికాః ॥

తా॥ దిక్కులేనివారును, విషయభోగ పరాయణులును పర బాధకులును, జ్ఞానవైరాగ్య శూన్యులును, బ్రహ్మచర్యము నుండి భ్రష్టులైనవారును, స్వధర్మచ్యుతులైనవారును కృష్ణనామోచ్చారణము చేసినంతమాత్రమున సద్ధర్మపరులకు గూడ లభ్యముకాని భగవత్ప్రాప్తి రూపమగు నుత్తమగతిని పొందుచున్నారు.

శ్లో॥ నదేశనియమస్తస్మిన్ న కాల నియమ స్తథా ।
నోచ్ఛిష్టాదౌ నిషేధోఽస్తి శ్రీహరేర్నామ్ని లుబ్ధకాః ॥
(విష్ణుధర్మము)

తా॥ ఓ లుబ్ధకులారా! హరినామ సంకీర్తనమునకు దేశకాల నియమమెంతమాత్రములేదు. ఎంగిలినోటితోనైనను భగవన్నామము చేయవచ్చును.

శ్లో॥ చక్రాయుధస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్ ।
నాశౌచం కీర్తనే తస్య స పవిత్ర కరోయతః ॥ (స్కాందపురాణము)

తా॥ శ్రీహరి సర్వమును పవిత్రము చేయుచున్నాడు గనుక నామసంకీర్తనమున కశౌచ భయములేదు. కావున భగవన్నామమును సదా సర్వత్ర కీర్తింపవలెను.

శ్లో॥ న దేశనియమో రాజన్ న కాల నియమ స్తథా ।
విద్యతే నాత్ర సందేహో విష్ణోర్నామాను కీర్తనే ॥

శ్లో॥ కాలోఽస్తి దానే యజ్ఞే చ స్థానే కాలోఽస్తి సజ్జపే ।
శ్రీవిష్ణుకీర్తనే కాలో నాస్త్యత్ర పృథివీతలేః ॥

(వైష్ణవచింతామణి)

తా॥ "ఓ రాజా! శ్రీహరి నామోచ్చారణమునకు దేశకాల నిబంధన లెంతమాత్రమును లేవు. దానము, యజ్ఞము మంత్రజపాదులకు మాత్రమే దేశకాల నియమములు గలవు గాని భగవన్నామో చ్చారణమునకు అవి ఎంతమాత్రములేవు".

శ్లో॥ ఏతన్నిర్విద్యమానానం మిచ్ఛతా మకుతోభయమ్ ।
యోగినాం నృప నిర్ణీతం హరేర్నామాను కీర్తనమ్ ॥

తా॥ సంసార సముద్రమునుండి ఉత్తీర్ణులగుటకు తలంపు గలిగిన యోగీశ్వరులకు కూడ హరినామమే శరణ్యము.

శ్లో॥ సకృదుచ్చారితం యేనహరి రిత్యక్షర ద్వయమ్ ।
బద్ధఃపరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ॥

(స్కాందపురాణము)

తా॥ హరినామము కంటె ముల్లోకములందును సులభముగ ముక్తినిచ్చు సాధనము మఱొకటిలేదు. నామమే జీవులను

తరింపజేయును. హరి యను రెండు అక్షరములను ఉచ్చరించిన మాత్రమున మోక్షము నొందుటకు అర్హులగుదురు.

శ్లో॥ సకృదుచ్చారయేద్యస్తు నారాయణ మతాన్ద్రితః ।
శుద్ధాంతః కరణో భూత్వా నిర్వాణ మధి గచ్ఛతి ॥

(పద్మపురాణము)

తా॥ జితేంద్రియులై ఎవరు నారాయణ యని ఉచ్చరించుదురో వారు చిత్తశుద్ధులై నిర్వాణమును బొందుదురు.

శ్లో॥ ఆపన్నః సంసృతిం ఘోరాం యన్నామ వివశో గృణన్ ।
తతః విముచ్యేత యద్విభేతి స్వయం భయమ్ ॥

(భాగవతము 1.1.14)

తా॥ భయంకరమైె సంసార సముద్రములోపడి జనన మరణములకు లోనగుచున్న వివశుడైన జీవుడు హరినామమును ఉచ్చరించుచు అచిర కాలములోనే దానినుండి ముక్తుడగును. అట్టి హరినామమును చూచి కాలమే భయపడుచున్నప్పుడు ఇక యమదూతల మాట చెప్పనేల ?

శ్లో॥ యస్యావతార గుణకర్మ విడంబనాని
నామాని యేఽసువిగమే వివశా గృణన్తి ।
తేఽనేక జన్మశమలం సహసైవ హిత్వా
సంయాన్త్య పావృతమృతం తమజం ప్రపద్యే ॥

(భాగవతము 3.9.15)

తా॥ ఎవరు అవసానకాలములో వివశులై భగవంతుని (దేవకీనందనుని) నామ, రూప, గుణ, లీలలను ఉచ్చరించుదురో వారు అనేక జన్మార్జిత పాపముల నుండి శీఘ్రముగ ముక్తినొంది, నిరస్తకుహక సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుని పొందుదురు. కావున జన్మరహితుడైన అట్టి భగవంతుని నేను శరణు బొందుచున్నాను అని బ్రహ్మస్తుతించెను.

శ్లో॥ వ్రజం స్తిష్ఠన్ స్వపన్న శ్నన్ శ్వసన్ వాక్యప్రపూరణే
నామసంకీర్తనం విష్ణోర్హేలయాకలి వర్ధనమ్
కృత్వా స్వరూపతాం యాతి భక్తియుక్తం పరంప్రజేత్ ॥

(విష్ణుపురాణం)

తా॥ నడచుచున్నప్పుడు, కూర్చున్నప్పుడు, స్వప్నమందు, భోజన, శయన కాలములందు కలిదమనమైన భగవన్నామమును హేళనముగా ఉచ్చరించినవారు నిర్భయముగా స్వస్వరూపముతో పరమపదమగు వైకుంఠమును జేరుదురు.

శ్లో॥ వాసుదేవస్య సంకీర్త్యా సురాపో వ్యధితోఽపివా ।
ముక్తో జాయేత నియతం మహావిష్ణుః ప్రసీదతి ॥

(వరాహపురాణం)

తా॥ కాలుజారి నప్పుడుగాని, సురాపానము చేయునప్పుడుగాని, లేక ఎట్టిపరిస్థితిలోనున్నను వాసుదేవుని కీర్తించినచో భగవదను

గ్రహముచే ముక్తినొందుదురు. దీనిని బట్టి భగవంతుడు ఎంతటి కరుణామయుడో తెలియుచున్నది.

శ్లో॥ ఇదమేవహి మాంగల్యం ఏతదేవ ధనార్జనమ్ ।
జీవితస్య ఫలంచైవ యద్దామోదర కీర్తనమ్ ॥

(పద్మపురాణం)

తా॥ దామోదర కీర్తనమే పరమపురుషార్థము. అదియే మంగళ దాయకమైనది. హరినామకీర్తనమే వాస్తవమైన సంపద, అదియే జీవితము యొక్క చరమఫలము అని సమస్త శాస్త్రములు ఘోషించుచున్నవి.

శ్లో॥ మధుర మధుర మే తన్మంగళం మంగళానాం
సకల నిగమవల్లీ సత్ఫలం చిత్స్వరూపమ్ ।
సకృదపి పరిగీతం శ్రద్ధయా హేలయా వా
భృగువర నరమాత్రం తారయేత్ కృష్ణనామ ॥(ప్రభాస ఖండము)

తా॥ ఓ రాజా! కృష్ణనామము మధురాతి మధురము. శ్రేయస్సులన్నిటికంటె శ్రేయస్సు, సమస్తవేదముల యొక్క ఫలము, చిత్స్వరూపము. ఆ కృష్ణనామమును ఎవరు శ్రద్ధతోగాని, హేళనతో గాని కీర్తించుదురో వారు తప్పక తరింతురు. ఇందు సంశయము లేదు.

శ్లో॥ అఘచ్ఛిత్ స్మరణం విష్ణోర్బహ్వాయాసేన సాధ్యతే ।
ఓష్ఠ స్పందన మాత్రేణ కీర్తనస్తు తతో వరమ్ ॥

(వైష్ణవ చింతామణి)

తా॥ భక్తిని గురించి చెప్పిన శాస్త్రములన్నిటియందు నామ సంకీర్తనమే సర్వశ్రేష్ఠమని నిరూపించబడినది. ఏలననగా అష్టాంగ యోగమువలన భగవత్స్మృతి లభించుట బహుకష్టము. కాని పెదవి కదిలించినంత మాత్రముననే నామసంకీర్తన యగుచున్నది.

శ్లో॥ యేన జన్మ శతైః పూర్వం వాసుదేవః సమర్చితః ।
తన్ముఖే హరినామాని సదా తిష్ఠంతి భారత ॥

(వైష్ణవ చింతామణి)

తా॥ ఎవరు శ్రద్ధతో శతజన్మములు వాసుదేవుని అర్చించుదురో అట్టివారి జిహ్వాగ్రమందు హరినామము సదా నృత్యము చేయును.

శ్లో॥ ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్ ।
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥

(విష్ణు పురాణం)

తా॥ కృతయుగమందు అనేక సంవత్సరములు ధ్యానము చేత, త్రేతాయుగమందు యజ్ఞముచేత, ద్వాపర యుగమందు అర్చనము చేత ఏ ఫలితమును పొందుదుమో ఆ ఫలితమును కలియుగములో కేశవుని సంకీర్తనము వలన పొందగలము.

శ్లో॥ మహాభాగవతా నిత్యం కలౌ కుర్వన్తి కీర్తనమ్ ।

(స్కాందపురాణం)

తా॥ మహాభాగవతోత్తములైన వారు ఈకలియుగములో నిత్యము హరినామ సంకీర్తనము చేయుచుందురు.

శ్లో॥ సకృదుచ్చారయ న్త్యేవ హరేర్నామ చిదాత్మకమ్ ।
ఫలం నాస్యక్షమో వక్తుం సహస్రవదనో విధిః ॥

శ్లో॥ నామోచ్చారణ మాహాత్మ్యం శ్రూయతే మహదద్భుతమ్ ।
యదుచ్చారణ మాత్రేణ నరో యాయాత్ పరం పదమ్ ॥
(బృహన్నారదీయ)

తా॥ చిదాత్మకమైన హరినామోచ్చారణ ఫలితమును బ్రహ్మ, శివుడు, అనంతుడు గూడ వర్ణించలేరు. నామోచ్చారణ ఫలితము అంతటి మహాద్భుతమైనది. అట్టినామము నుచ్చరించిన మాత్రమున మానవులు పరమపదమును పొందుదురని శాస్త్రములు చెప్పుచున్నవి.

శ్రీకృష్ణుడు అర్జునునకు ఈవిధముగా చెప్పెను-

ఓ అర్జునా! ఎవరు శ్రద్ధతోగాని, హేళనతో గాని నాయొక్క నామము నుచ్చరించుదురో ఆనామము నాహృదయములో నుండును. నామముతో సమమైన వ్రతముగాని, జ్ఞానముగాని, ధ్యానముగాని, ఫలముగాని, త్యాగముగాని లేదు. నామముతో సమమైన పుణ్యము గాని, మరి ఏదియూ సమానమైనది లేదు. నామము యొక్క మహిమను వేదములుగూడ వర్ణించలేవు. నామమే పరమముక్తి

పరమగతి, పరమప్రీతి, పరమస్మృతి, జీవునకు నామమే కారణము, నామమే జీవునకు ప్రభువు, పరమ ఆరాధ్య వస్తువు. నామమే పరమ గురువు.

శ్లో॥ యన్నామ సకృచ్ఛ్రవణాత్ పుక్కశోఽపి విముచ్యతే సంసారాత్ ॥

(భాగవతం 6.-16-44)

తా॥ భగవన్నామము ఎంతటి మహత్తరమైనదనిన, దానిని కొంచెము శ్రవణము చేసినను, కడజాతికి జెందిన వారు గూడ సంసారము నుండి విముక్తులగుదురు.

శ్లో॥ కృష్ణకృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః ।
జలం హిత్వా యథా పద్మం నరకాదుద్ధరామ్యహమ్ ॥

(నరసింహపురాణం)

తా॥ కృష్ణా!కృష్ణా! యని ఎవరు నన్ను నిత్యము స్మరించుదురో వారిని జలమునుండి పద్మమువలె నేను నరకము నుండి రక్షించుదును.

శ్లో॥ కృష్ణ కృష్ణేతి కృష్ణేతి స్వపన్ జాగ్రద్ వ్రజం స్తథా ।
యోజల్పతి కలౌ నిత్యం కృష్ణరూపీ భవేద్ధిసః ॥

తా॥ ఎవరు స్వప్నమందుగాని, జాగ్రదావస్థయందుగాని కృష్ణనామమును నిత్యముస్మరించుదురో, వారు కలియుగములో కృష్ణరూపులై కృష్ణసన్నిధానమును జేరుదురు.

శ్లో॥ నామ్నాం ముఖ్యతరం నామ కృష్ణాఖ్యం మే పర న్తప।
ప్రాయశ్చిత్తమశేషాణాం పాపానాం మోచకం పరమ్ ॥

(ప్రభాసఖండము)

తా॥ సర్వోత్కృష్టమైన కృష్ణనామము ప్రాయశ్చిత్తము లన్నిటికంటె ఉత్తమమైనది. జీవుడు కృష్ణనామమును ఆశ్రయించుటవలన అశేషపాపములనుండి విముక్తుడగును.

శ్లో॥ నామ చింతామణిః కృష్ణశ్చైతన్య రసవిగ్రహః ।
పూర్ణ శుద్ధోనిత్యముక్తోఽభిన్నాత్వన్నామ నామినోః ॥

(భక్తిరసామృత సింధువు)

తా॥ నామము చింతామణివంటిది. చైతన్యరసస్వరూపము. పూర్ణమైనది, శుద్ధమైనది, నిత్యముక్తమైనది, నామమునకు నామికి (భగవంతునకు) భేదములేదు.

శ్లో॥ ఓం ఆఽస్య జానన్తో నామ చిద్వి వక్తన్ ।
మహాస్తే విష్ణో సుమతిం భజామహే ఓం తత్ సత్ ॥

(ఋగ్వేదము)

తా॥ విష్ణునామము, విష్ణుశక్తియొక్క ప్రభావమును గ్రహించిన బుద్ధిమంతులు, అప్రాకృత తత్త్వమును తెలిసికొన వలయుననియు, సుబుద్ధి కావలయునని భగవంతుని ప్రార్థింతురు.

'స్థానేశ్వరి కృష్ణదాసుడు' వినయవిధేయతలతో 'శ్రీమన్మహా ప్రభో! నాయొక్క ప్రార్థనను ఆలకించవలెను' అని కోరెను. నామము ఇంతటి ఉత్కృష్టమైన మాహాత్మ్యమును వింటిని. కాని ఈ ప్రకారముగ నామము చేసినవారికి ఫలితము గలుగకుండుటకు కారణమేమి?

మహాప్రభు :- అన్నిటికి శ్రద్ధ, విశ్వాసమే కారణము. విశ్వాసములేని కారణముగా ఫలితము లభించుట లేదు, భగవంతుడు అంతర్యామి స్వరూపుడు. నామముచేసిన వారి హృదయమున ఎంతటి విశ్వాసముండునో వారికి అంతటి ఫలితమునే ఇచ్చును. నామ మహిమయందు పరిపూర్ణ విశ్వాసములేనికారణముగ పూర్ణ ఫలితమును పొందజాలకున్నారు. దీనివలన వారికి అపరాధము కలుగుచున్నది. నామమును అర్థవాదమని అనేకులు భావించుదురు. దానివలన విశ్వాసహీనులై నామ ఫలితమును బొందలేరు. అట్టివారు నరకమునకు గురియగుదురు.



# నామరహస్యము

సాక్షాత్ గోలోకవిహారియగు శ్రీకృష్ణభగవానుడు రాధాకృష్ణ మిళిత తనువై కలియుగములో 1486వ సం॥లో శ్రీచైతన్యమహాప్రభువుగా నవతరించిరి. కృత, త్రేతా, ద్వాపర యుగములలో క్రమముగా ధ్యాన, యజ్ఞ, అర్చనాదులు సాధనములుగా పేర్కొనబడినవి. కాని కలియుగజీవులు అల్పాయుష్కులు, కుటిల చిత్తులు కావున సులభముగా తరించి భగవత్సాన్నిధ్యమును జేరుటకు హరినామ సంకీర్తనమే యుగధర్మముగా ఏర్పరచిరి. శ్రీమన్మహాప్రభువుయొక్క అవతార ప్రయోజనము జాతి, మత, కుల, విచక్షణలేక సర్వులను నామసంకీర్తన ద్వారా తరింప జేయుటయే.

ఒకానొక రోజున వెన్నెలనాటి రాత్రి వాతావరణము ప్రశాంతముగ నున్నది. సముద్రతీరమున మహాప్రభువు తన భక్త బృందముతో సమావేశమైరి. అపుడు ఆయన భక్తహరిదాసు మున్నగువారితో నామరహస్యమును గుఱించి ఈ విధముగా విశదీకరించిరి.

ఓభక్తులారా! ఈకలియుగములో శ్రీకృష్ణనామస్మరణము తప్ప వేరు మార్గములేదు. అప్రాకృత సంపత్తిని పొందుటకు కర్మ జ్ఞాన, యోగ, ధ్యానాదులు దుర్బలమైనవి. ధర్మ, వ్రత, హోమ, త్యాగాదులు ప్రకృతి సంబంధములు. అప్రాకృత తత్త్వమును పొందుటకు అవి

సహాకరించవు. కృష్ణనామ శ్రవణ స్మరణ, కీర్తనములచేత అప్రాకృత సిద్ధిలభించునని సర్వశ్రుతులు ఘోషించుచున్నవి. నామ ఉచ్చారణ మాత్రముననే చిత్సుఖము లభించునని నామము యొక్క రహస్యమును సమస్త శాస్త్రములు తెలియజేయుచున్నవి.

పద్మపురాణమందు స్వర్గఖండములో నామరహస్యమును గురించి శ్రీసూతులవారికి శౌనకాది మహర్షులకు ఈక్రింది విధముగా సంవాదము జరిగినది.

శౌనకుడు సూతునకు నమస్కరించి ఇట్లు అడిగెను-

సాధువులలో ఉత్తముడవైన ఓ సూతమునీంద్రా! నామోచ్చారణ మాహాత్మ్యము వినుటకు పరమాద్భుతముగా నున్నది. ఏ నామ ఉచ్చారణమాత్రమున మానవులు తరించి పరమపదమును చేరుదురో అట్టి నామసంకీర్తనమును గురించి, దానిని చేయవలసిన విధానమును గురించి దయచేసి విపులీకరించ వలసినది'' అని వేడగా సూతుల వారిట్లు సమాధాన మొసంగెను. శౌనకా! మోక్షసాధనమును గూర్చి చెప్పెదనువినుము. పూర్వము నారదుడు అడుగగా సనత్కుమారుడు చెప్పినదానిని నీకు చెప్పెదను.

ఒకసారి యమునాతీరమునందు ప్రశాంతమనస్కుడై యున్న సనత్కుమారునికి నమస్కరించి నారదుడు ఇట్లు అడిగెను.

శ్రుత్వా నానావిధాన్ ధర్మాన్ ధర్మవ్యతికరాం స్తథా!

శ్రీనారద ఉవాచ :-

శ్లో॥ యోఽసౌ భగవతాప్రోక్తో ధర్మవ్యతికరోన్నృణామ్ ।
కథం తస్య వినాశః స్యాదుచ్యతాం భగవత్ప్రియ ॥

అని నారదుడు సనత్కుమారుని ప్రశ్నించెను.

ఈ ప్రశ్నయొక్క రహస్యమునందు ఒక విశేషముగలదు. ఆవిషయమును చెప్పెదను. రామానందా! స్వరూపదామోదరా! శ్రద్ధగా వినుడు.

## నామసంకీర్తన మనగానేమి? ఉచ్చారణ అనగా నేమి?

"ఉచ్చారణ" శబ్దమునే సంకీర్తన యందురు. కొందరు భక్తులు జపమాలతోను, కొందరు సంఖ్యానామముతోను మరికొందరు సంఖ్యనువిడిచి అసంఖ్యాకముగాను చేయుదురు. వీటినన్నిటిని ఉచ్చారణమని తెలిసికొనుము.

## జపము, కీర్తనము :-

మౌనముగ లేక లఘు ఉచ్చారణముతో చేసిన నామమును జపమనియు, ఉచ్చైస్స్వరముతో చేసిన నామమును కీర్తనమని అందురు. ఏవిధముగా కీర్తనము చేసిన యెడల ఉత్తమమైన కీర్తనయగునో అది "నామ సంకీర్తనము" అను గ్రంథమునందు విపులముగా చెప్పబడినది.

## నామసంకీర్తనమే సర్వదా సర్వత్ర కర్తవ్యము :-

శ్రీనామసంకీర్తనము జీవునియొక్క నిత్యధర్మము. భూలోక మందున్నను, వైకుంఠమునందున్నను జీవునకు సంకీర్తనము చేయుటయే ముఖ్యకర్తవ్యము. సంకీర్తనము బద్ధజీవునకు మోక్ష సాధనముగను, ముక్తజీవునకు సాధ్యముగను సహకరించును.

## భక్తి హీన శుభకర్మలను త్యజింపవలెను :-

ధర్మశాస్త్రములలో చెప్పబడిన భక్తిహీన ధర్మములను, భక్తి రహితమైన వ్రతములను, భక్తికి తోడ్పడని వైరాగ్యమును త్యజించవలెను. భక్తికి ప్రతికూలమైన యజ్ఞయాగాదులు గూడ ప్రకృతికి సంబంధించినవే యగును. అనగా అవి ఐహిక విషయ భోగములనే కలుగజేయును. పైన చెప్పిన శుభకర్మలన్నియు భక్తికి అనుకూలముగా నుండవలెనని శాస్త్రములు తెల్పుచున్నవి. కలికాలములో ఈ ధర్మములన్నియు జడములు, భక్తికి అనుకూలముగాలేని కారణమున ధర్మము నశించినది. కావున కలికాలములోనామసంకీర్తనతప్ప ఇతరధర్మములు లేవు. ఏ ధర్మము భక్తికి వ్యతిరేకముగానుండునో దానిని వదలివేయవలెను.

ఇంకను సనత్కుమారు డిట్లు చెప్పెను.

ఓ నారదా! నీవు గోవిందప్రియుడవు. గోవిందుని ధర్మమును బాగుగా తెలిసినవాడవు. మాయాబంధనమును ఛేదించు

కొనినవాడవు. కావున నీవు అడిగిన ప్రశ్న లోకహితము కొఱకే గాని నీకొఱకుగాదు. నీ ప్రశ్నలవలన జీవులు తమస్సును దాటి పరమపదము నొందుదురు.

ఏ జీవుడు గోవింద పాదారవిందములను శరణు బొందునో వాని సమస్తపాపములు నామ ఉచ్చారణ ప్రభావమువలన దహింప బడును. కృష్ణనామము నుచ్చరించుచు పశ్చాత్తాపతప్తుడై కన్నీరు గార్చుచు తనయొక్క దోషములను భగవంతునికి విన్నవించినయెడల వానిపాపములు భక్తివలన అతి శీఘ్రముగా నశించును.

## కర్మ ప్రాయశ్చిత్తమువలన వాసనలు నశించవు :-

కర్మ, జ్ఞానముల ప్రాయశ్చిత్తమువలన ఫలితమేమి యున్నది? దానివలన ఫలితము దుర్బలమైనది, అశాశ్వతమైనది, ఒక్క కృష్ణ నామోచ్చారణము వలననే అనేక జన్మముల పాపము నశించును. మరల అట్టివాడు కోటి జన్మలలో కూడ పాపము చేయలేడు. ధర్మశాస్త్రములలో వర్ణింపబడని పాపములను సైతము కృష్ణనామము నశింపజేయును. అయినచో స్మార్తులు ఎందుకు ప్రాయశ్చిత్తములను జేసికొందురు ?

సుకృతములేని కారణమున వారి మనస్సు వైదిక లౌకిక కర్మలచే ఆకర్షింపబడుచున్నది. కర్మప్రాయశ్చిత్తమువలన మనసులో కొంతవరకు మార్పు కలుగును, గాని వాసనలు నశింపవు.

## వాసనకు మూలకారణమగు అవిద్య భక్తివలన నశించును :-

కర్మ,జ్ఞానములయొక్క ప్రాయశ్చిత్తములద్వారా పాప వాసనలు నశించవు. ఒకవేళ నశించినను కొంతకాలమునకు మరల స్థూలరూపము ధరించి మొలకెత్తును. కాని వాసనలకు మూల కారణమైన అవిద్య వేళ్లతో సహ పూర్తిగ భక్తి వలననే నశించును.

ఎవరు గోవిందుని శరణుజొచ్చి ఆర్తితో, నమ్రతతో నామము చేయుదురో, అట్టివారికి భగవంతుని ఉపదేశములు మధురముగను, శ్రావ్యముగనుండును. దానివలన జీవునకు శ్రేయస్సుకలుగును. దీనికి ప్రమాణములు పెక్కుగలవు.

**భగవద్గీత :-**

1. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
   అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥
   (18-66)

2. అపిచేత్ సుదురాచారో భజతే మామనన్య భాక్ ।
   సాధురేవ సమన్తవ్యః సమ్యగ్వ్యవ సితో హిసః ॥ (9-30)

3. క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
   కౌన్తేయప్రతి జానీహి న మేభక్తః ప్రణశ్యతి ॥ (9-31)

**నామముయొక్కఫలితము :-** కావున బుద్ధిమంతుడు కర్మసంగ ప్రాయశ్చిత్తములను విసర్జించి, ప్రాణేశ్వరుడైన భగవంతునే

భజించును. కృష్ణనామము దయనీయమైనది, కృష్ణుడు తేజోమయుడు. ఆయన స్థావరజంగములకు కూడ ముక్తిని ప్రసాదించును. నామాపరాధము వలన నామఫలము సిద్ధించదు. నామప్రభావము వలన మహాపరాధ దోషములు గూడ శమించును. నామముతప్ప జీవునకు జగద్బంధువు వేరెవరును లేరు.

**నామాపరాధము :-**

**నారద ఉవాచ :-**

శ్లో॥ కేతేఽపరాధా విప్రేంద్ర నామ్నో భగవత: కృతా: ।
విని ఘ్నంతి నృణాం కృత్యం ప్రాకృతం హ్యానయ న్తిచ ॥

నారదుడు సనత్కుమారునితో "గురువర్యా! నామాపరాధము లెన్నియో సెలవిండు, జీవుడు నామయజ్ఞము చేయవలెను. ఆ యజ్ఞము చేయునపుడు పతనము రాకుండుటకు మార్గముకూడ జెప్పుడు. ప్రాకృతబుద్ధితో నామము చేసినయెడల ప్రాకృత ఫలమునే ఇచ్చునుగదా! కావున వీటన్నిటిని గూర్చి విపులీకరించి తెలియ జేయుడు" అని అడుగగా -

**శ్రీ సనత్కుమార ఉవాచ :-**

శ్లో॥ సతాం నిందా నామ్న: పరమపరాధం వితనుతే ।
యత: ఖ్యాతిం యాతం కథము సహతే తద్విగర్హామ్ ॥

సనత్కుమారుడు చెప్పెను :- మంగళస్వరూపుడైన హరియే పరతత్త్వము. అప్రాకృత స్వరూపముతో భగవంతుడు వ్రజ మండలములో విహరించుచున్నాడు. ఆ హరియొక్క నామమును జపము చేయునపుడు కల్గు అపరాధములు పది. వాటిని విపులముగా తెలిసికొని ప్రయత్నముతో విసర్జించవలెను.

ప్రథమ అపరాధమైన సాధునిందను, ద్వితీయ అపరాధమైన ఇతర దేవతాదూషణమును గూర్చి చెప్పెదను, వినుము.

ఎవరు ఏకాంతమున కృష్ణనామము నుచ్చరించుదురో అట్టి వారిని సాధువని వ్యవహరింతురు. దానివలన వారు సంసార సముద్రమునుండి ఉత్తీర్ణులగుదురు. సాధువులు ఐహికజడ కర్మ జ్ఞానయత్నములు విసర్జించి శుద్ధ భక్తిభావముతో నామము నుచ్చరింతురు. వీరే నామమును ప్రచారము చేయుటకు సమర్థులు.

**1. సాధునింద :-**

సాధువులను దూషించినయెడల కృష్ణ నామమును చేసిన ఫలితమును ఎన్నడును మనము పొందలేము. పైన చెప్పిన లక్షణములుగల సాధువులను నిందించినను, వారిని అల్పబుద్ధితో చూచినను సాధునిందయను గొప్ప అపరాధము కలుగును. ఇట్టి అపరాధమును బహుజాగ్రత్తగా విసర్జించవలెను. సాధు సాంగత్యము చేయుచు, భజనచేయవలెను. భగవంతుని నామ, రూప, గుణ, లీలలు అప్రాకృతములు. అవి భగవంతుని స్వరూపముకంటె

వేఱుకావు. భగవంతుని నామము, రూపము భిన్నములు కావు. రెండును అప్రాకృతములే. జడబుద్ధితోనున్న మనము ఈ నామ రహస్యము గ్రహింపలేము. స్వచ్ఛమైన జ్ఞానమువలన, భక్తివలన మాత్రమే ఈవిషయము తెలియును. తర్కమునకు గోచరముకాదు. మనముచేసిన సాధనవలన గురు వైష్ణవుల కృపవలనను ఈ తత్త్వమును తెలిసికొనగలుగుదుము. ఈతత్త్వసిద్ధి లభించనంత వరకు మనయందు ప్రాకృతబుద్ధి నశింపదు. నామముచేసి నామస్వరూపము అనుభూతి పొందనంత వరకు మనముచేసిన నామము నామాభాసముమాత్రమే యని గ్రహించవలెను. ఎంతయో ప్రయత్నముచేసినగాని మనకు స్వరూపసిద్ధి కలుగదు. శుద్ధ నామోచ్చారణవలన మనకు పరమ పదమునకు వెడలుటకు ఇచ్ఛ కలుగును. జాగ్రత్తగా శ్రద్ధతో గూడి నామాభాసముతో నామము చేయగా చేయగా భగవంతుడు అనుగ్రహించి తనస్వరూపసిద్ధిని మనకు కలుగజేయును.

## 2. కృష్ణుడు సర్వేశ్వరుడు శివాది దేవతలు ఆయన అంశము;

కృష్ణుడు సర్వేశ్వరుడనియు, శివాది దేవతలు ఆయన అంశము లనియు నిశ్చయపూర్వకముగ తెలిసికొనుము. కృష్ణుడు దేవతలకు వారివారి నామాదిగుణములను బట్టి వారికి తగిన శక్తిని ప్రసాదించెను. వారు సిద్ధస్వరూపులు. ఈవిధముగా విష్ణువు, శివుడు మొదలగు దేవతలకు భేదములేదు. దీనిని తెలిసికొనిన జీవునకు స్వరూపసిద్ధి కలుగునని నాల్గువేదములందు చెప్పబడినది. విష్ణువు శివాది

దేవతలకంటె వేరను భేదబుద్ధియను అపరాధమును యత్నముతో త్యజించి గుర్వనుగ్రహమున నామభజనము చేయవలెను.

### 3. గురు అవజ్ఞత :

ఎవరు దయతో హరినామోపదేశముద్వారా భగవంతుని దర్శింపజేయుదురో అట్టి గురువు మనకు కర్ణధారుడు. అనగా మన జీవితమనెడి నౌకను సరియగుమార్గమున నడిపి గమ్యస్థానమగు భగవత్ప్రాప్తిని కలుగజేయువాడే గురువు. అట్టి మహాశయుడగు గురువును నిందించుట, ఆదరింపకపోవుటయు మహాపరాధము. మరియు హీనజాతికి జెందినవాడు, పాండిత్య రహితుడు, మంత్రహీనుడను బుద్ధితో గురువును చూచుటకూడ అపరాధము. దీనివలన మనము పరమార్థ విషయమున వెనుక బడుదుము.

### 4. శ్రుతిశాస్త్ర నింద :

శ్రుతులు, శాస్త్రములు భగవంతుని స్వరూపము ఆయన లీలలు, ప్రభావము గూర్చియు నామమాహాత్మ్యమును గూర్చియు మనకు తెలియజేయును. అట్టి శ్రుతి శాస్త్రములను నిందించుట అపరాధము.

### 5. నామము కల్పింపబడినది అనియెడు బుద్ధి :

భగవంతుని నామము చిన్మయమైనది, అగాధమైనది, అది మనకు నిత్యధనము. అట్టినామము కల్పితమని, ప్రాకృతమని భావించుట అపరాధములలో మేటి.

### 6. నామబలముచే పాపముచేయుట :

కొందరు నామముచేయుచునే పాపకార్యములను గూడ చేయుదురు. నామబలమును ఆధారముగా జేసికొని పాపకృత్యములు జేయుచు వాటినుండి విముక్తులమగుదుమని తలంచుట భ్రమ.ఇది అపరాధమగును.

### 7. నామము ప్రయోజనము కొఱకుపయోగించుట :

కర్మమార్గమునందు చెప్పబడిన (దైవకార్యములు) పద్ధతుల ననుసరించిన తాత్కాలిక ఫలితములను పొందగలుగుదుము, కాని భక్తిమార్గమునందు చెప్పబడిన దైవకార్యములవలన శాశ్వత ఫలితములను అప్రాకృత ఫలితములను పొందవచ్చును. నామము యొక్క ఫలితము వర్ణనాతీతమైనదని తలంచి నామమును ఐహిక ప్రయోజనముకొఱకు ఉపయోగించుట అపరాధము. ఈ అపరాధములను దరికి రానీయక నామమును చేసినయెడల సత్ఫలితములనుపొందవచ్చును.

### 8. శుభకర్మలతో నామము సమానముగ భావించుట :

శాస్త్రోక్తములైన వర్ణాశ్రమధర్మములు, దర్శ పౌర్ణమాసాది తామసిక వ్రతములు, దండి ముండి మున్నగు సన్యాసాశ్రమనియమములు, నిత్యనైమిత్తికాది హోమములు, అష్టాంగ షడంగాది శుభకర్మములు

మొదలగునవన్నియు ప్రాకృతములే. వీటివలన క్షణికమైన ప్రాకృత ఫలితములనే పొందవచ్చును. ఈ వ్రతములు శుభకర్మలవలన సాధ్య వస్తువును (భగవంతుని) పొందలేము. భగవన్నామము నుచ్చరించుటవలన శాశ్వతమైన అప్రాకృత ధామమును జేరగలము.

## నామమే ఉపాయము - ఉపేయము

ఇతరకర్మలయందు సాధన (ఉపాయము) వేఱు; దానివలన పొందబడే సాధ్యము(ఉపేయము) వేఱు. సాధ్యవస్తువు లభించిన తరువాత సాధనతో పనిలేదు. కాని భగవన్నామము అట్టిది కాదు. ఏనామము సాధనకాలమునందు ఉపాయముగనుండునో అదే నామము సిద్ధావస్థలో ఉపేయముగ నుండును. నామమే సాధన, నామమే సాధ్యము. కావున నామము విశుద్ధమైనది. చిన్మయమైనది.

జడములగు ఉపాయకర్మలు (కర్మ, జ్ఞానములు) ఎన్నడును నామముతో సమానము కానేరవు. అట్లు సమానమని తలంచుట మహాపరాధము.

## 9. విశ్వాసహీనునకు నామము నుపదేశించుట :-

భగవంతునియందు భగవన్నామమునందు విశ్వాసము లేని భాగ్యహీనునకు నామమునుపదేశించుట గూడ మహత్తర అపరాధమగును. ఇట్టి అపరాధమును సాధుగురు అనుగ్రహము

వలన యత్నముతో తొలగించవలెను. అపుడే నామముయొక్క ఫలితమును పొందగలము.

## 10. శ్రీనామమాహాత్మ్యమును వినియు నామమునందు అనురాగము లేకుండుట :-

శ్లో॥ శ్రుతేఽపి నామమాహాత్మ్యే యః ప్రీతి రహితో నరః ।
అహం మమాది పరమోనామ్నిసోఽప్య పరాధకృత్ ॥

శాస్త్రములద్వారా నామమహత్తును శ్రవణముచేసియు నెవడు దానియందు ప్రీతినొందక దేహాత్మబుద్ధితో అహంకార మమకారములతో పేరుప్రతిష్ఠలకై ప్రాధేయపడునో, పాపకార్యము లందే నిరతుడైయుండునో పాపమునుండి విముఖుడగుటకు యత్నముగూడ చేయడో అట్టివాడు శ్రద్ధతో నామమును చేయలేడు. అసద్విషయములందు ఆసక్తి కల్గియుండిన కారణమున సత్సాంగత్యమునందు వానికి బుద్ధి ప్రవేశింపదు. ఐహికసుఖముల కొఱకు వాడు వివేక వైరాగ్యములను జారవిడుచుకొనును. దీని వలన వారికి అపరాధముకలుగుచున్నది. ఈఅపరాధఫలితముగనే నామమునందు రుచి కలుగుటలేదు. వాడు కృష్ణసంసారమయముగ జీవితమును గడుపుట లేదు.

(1. సాధునింద, 2. శివాదిదేవతలను భగవానునితో సమాన భావము కలిగియుండుట, 3. శ్రుతిశాస్త్రనింద, 4. గురువును

నిర్లక్ష్యముచేయుట, 5. ఇతర శుభకర్మలతో నామము సమానమని తలంచుట, 6. నామము కల్పితమని భావించుట, 7. నామబలముతో పాపముచేయుట, 8. విశ్వాసహీనునకు నామమునుపదేశించుట, 9. నామమహిమను కేవలము స్తవమని తలంచుట, 10. శ్రీనామ మాహాత్మ్యమును వినియు అహంకార మమకార యుక్తుడై నామమునందు రుచిలేనివాడగుట.)

ఈ పది నామాపరాధములు మన పరమార్థమునకు ప్రతిబంధకము కలిగించి నామముయొక్క ఫలమును దూరము చేయును. దానివలన మనకు శ్రేయస్సు నిరుద్ధమగును.

శ్లో॥ సర్వాపరాధ కృదపి ముచ్యతే హరి సంశ్రయః
హరేరప్యపరాధాన్ యఃకుర్యాద్ద్విపద పాంసనః ।
నామాశ్రయః కదాచిత్ స్యాత్తర త్యేషసనామతః
నామ్నోహి సర్వసుహృదోప్య పరాధాత్ పతత్యధః ॥

జీవుని సమస్త అపరాధములు, పాపము, తాపత్రయములు హరిని ఆశ్రయించినయెడల తత్క్షణము క్షీణించును. ఎవరు కలి సంసారమును పరిత్యజించి నిష్కపటముగా కృష్ణ సంసారము చేయుదురో వారికినెట్టి అపరాధములు అంటవు. (కృష్ణసంసారమనగా సమస్త కార్యములు భగవదర్పణముగా చేయుట, కలి సంసారమనగా స్వప్రయోజనము కొఱకు జీవితము గడుపుటయని తెలిసికొనవలెను.)

భగవంతునకు, భగవన్నామమునకు భేదములేదు. కావున నామము నాశ్రయించినవారికిగూడ యనేక జన్మార్జిత పాపములు క్షీణించును. నిష్కపటముగా మనమెప్పుడు భగవంతునికి ఆత్మనివేదనము చేయుదుమో అపుడు కృష్ణుడు మనపూర్వకృత సమస్తపాపములను తొలగించును. అప్పుడు ఇంక ప్రాయశ్చిత్తము లతో బనిలేదు. హరిదీక్షను బొందినంతమాత్రముననే బహుజన్మలలో చేసిన పాపములు ఖండింపబడుచున్నవి. నిష్కపటముగ హరిని ఆశ్రయించినచో అపరాధములు తొలగుటయే గాక, పాపకృత్య మందు అభిలాష నశించును. తాపత్రయము తొలగును. దానిచే మాయను అనాయాసముగ జయింప వచ్చును.

**సేవాపరాధము :** నామాపరాధమేగాక, సాధకునకు సేవాపరాధము వలన గూడ భక్తికి ఆటంకమేర్పడును. సాధుసంగములోనుండి కృష్ణనామము నాశ్రయించిన యెడల సేవాపరాధము నశించును. నామానుగ్రహమువలన జీవునకు సర్వసిద్ధి కలుగును. అపుడు కృష్ణసాన్నిధ్యమున నుండి చిన్మయమైన సేవ చేయ గలుగును.

**నామాపరాధములను సర్వదా త్యజింపవలెను :**

నామాపరాధములను తెలిసికొనిగూడ నామాపరాధము చేసిన యెడల పతితులగుట తథ్యము. హరినామముసర్వ జీవులకు బంధువు. అట్టినామము విషయమున అపరాధము చేసినయెడల

మనకు సంతరణ మార్గముండదు. కావున బహుజాగరూకతతో నామాపరాధము చేయకుండుటకు యత్నము చేయవలెను. నామానుగ్రహమువలన భగవత్ప్రాప్తి లభించిన జీవునకు సర్వము లభించినట్లే.

ఈవిషయమునే సనత్కుమారుడు ఒకరోజున నామాప రాధమునుగూర్చి చెప్పుచు, భగవంతునియొక్క నామము జీవునకు సమస్తమంగళములు చేకూర్చుననియు, అట్టినామము యెడల అపరాధము చేసిన యెడల అమంగళము కలుగునని శ్రేయోభి లాషులు సదా సర్వత్రా నామాపరాధములను త్యజించవలెనని శివుడు చెప్పినట్లు నారదునకు తెలియజేసెను.

కావున సద్గురువునాశ్రయించి, వినయ విధేయతలతో నామాపరాధములను గూర్చి తెలిసికొని యత్నముతో తొలగించు కొనినయెడల అనతికాలములో కృష్ణ ప్రేమను పొందవచ్చును. దీక్షతో నామమును తీసికొని నామాపరాధమును తొలగించుకొనుటకు యత్నము చేయనివారికి అపరాధములు ఆవరించును. అపరాధమని తెలిసియు దానియందు ఉదాసీనముగానున్న యెడల చిరకాలము దుఃఖము అనుభవించవలసియుండును. తల్లిమీదకోపగించి పిల్లవాడు భోజనము మానినట్లును, మందువాడుచు పథ్యము

కావున సర్వకాల సర్వావస్థల యందు శుద్ధనామమును కీర్తించుము. దానివలన సర్వ శ్రేయస్సులు లభించును, సర్వాశుభములు క్షీణించును.

## అసత్సంగమును పరిత్యజించి నామమును చేయవలెను.

ఇట్టి యపూర్వమైన నామము దుర్జన సాంగత్యము చేయుచు చేసిన సత్ఫలితములనీయదు. దేహ, ధన, జన, లోభ పాషండ సంగతివలన నామఫలమునకు ఆటంకము ఏర్పడి జీవుడు భ్రమనొందుటకు అవకాశముగలదు. కావున మున్ముందుగ విషయముల సాంగత్యము విడచి అనన్య శరణత్వ బుద్ధితో నామము చేయువలెను. నామానుగ్రహమువలన ప్రమాదరహితుడై, అపరాధరహితుడై శ్రేయస్సు నొందగలడు, నిరపరాధముగ కృష్ణనామము నాశ్రయించుటవలన కృష్ణప్రేమ లభించును. ఇదియే మానవజీవిత చరమలక్ష్యము. అపరాధ యుక్తమైన నామమువలన కైతవమే లభించును. అట్టి దుస్సాంగత్యమునుత్యజించి నామము నాశ్రయించవలెను.

శ్లో॥ ఇదం రహస్యం పరమం పురా నారద శంకరాత్ ।
శ్రుతం సర్వాశుభహరౌమపరాధ నివారకమ్ ॥

తా॥ ఓనారదా! పూర్వము శంకరుడు నాకు సర్వాశుభ నాశకరమగు యీ నామరహస్యమును అపరాధ నివారణోపాయమును చెప్పినారు.

అపరాధయుక్తులుగూడ విష్ణునామము నాశ్రయించినచో ముక్తు లగుదురు.

**నామరహస్య ప్రచారము.**

ఓ స్వరూప దామోదరా! రాయరామానందా! ఈనామ రహస్యమును మీరు అవశ్యము ప్రచారము చేయుడు. కలి యుగములో జీవులు తరించుటకు నామముతప్ప వేఱు గతి లేదు. నేను పూర్వము చెప్పిన శిక్షాష్టక తత్త్వముగూడ వ్యాసుల వారి వాక్యములలో (భాగవతములో) నున్నది.

అందరుకలిసి నామప్రచారము చేయుడు. అనుక్షణము నామరహస్యమును స్మరించి నామసంకీర్తనము చేయుడు, నామాచార్య హరిదాసు ఈ నామరహస్యమును గుఱించి యిదివరలోనే ప్రచారము చేసియున్నాడు. ఈనామ రహస్యమును తెలిసికొని ఆచరించి ప్రచారముచేసెను. కావున ఆతడు "నామాచార్య హరిదాసు" అని ప్రఖ్యాతిగాంచెను. ఎవరు నామాచార్య హరిదాసు ననుసరించి నామభజన చేయుదురో వారు తప్పక సిద్ధి పొందుదురు.



